మిూఁది ఖణ్డబిన్దువునకుఁ బూర్ణబిన్దువు రాదు. అని సిద్ధాన్తము చేసికొనవలెను. రాముఁడు, సోముఁడు అనవలెనుగాని రాముణ్డు, సోముణ్డు అనరాదు. ఎన్దు కనవలెను ? ఇమ్మా ? సొమ్మా ?

---

# ఎడుగని బిడ్డ.




సన్తానహీనులు కొన్దఱు. దారిద్ర్యపీడితు
లు కొన్దఱు. రోగబాధితులుకొన్దఱు. క్షుధా హాతులు కొన్దఱు. ఎవరిమొరల నాలిమ్పఁగలము ? అని తలఁతురు. నిజమే కాని నాకథనమును పూర్తిగా వినవలసినది. ఆలిమ్పఁదగినవి కొన్నిగలవని మిూరేయనుకొన్దురు. నేను బిగ్గఱగా మాటలాడలేను. పెద్దదానను. ఈకాలపుదానను గాను.

సుమారెనిమిది నన్దలయేణ్డ్లక్రిన్దఁ గట్టిని.

అసత్యము కాదు. రాజరాజనరేన్ద్రు నన్తటివాఁడు బిడ్డరూపు రేఖలఁజూచి నాలుక కొఱుకు

కొనెను; ఎత్తుకొనెను; సొమ్ములుపెట్టెను; రుమాళ్లుకప్పెను.

ఇతరులస్తోత్రములకేమి? తెలిసినుతిన్చువారొకరు తెలియక నుతిన్చువారొకరు. నన్ను నేనేపొగడుకొణ్టిని.

బిడ్డ రాజులతూగుటుయ్యెలలో నూగును; రాజుల బఙ్గారుచేతులలోఁ బెరుగును; రాజుల రత్నాల మేడలలోఁ దిరుగును. అని సన్తోషపడితిని. ఇది పూర్వజన్మ సుకృతఫలమని యన్దురుగాని యేజన్మముదైననేమి? ఆవిచారణ యనవసరమని నేననుకొన్దును. బిడ్డయెప్పుడును అక్కడనే. చఙ్కదిగి యెఱుఁగదు. దాదివలెఁ బోయిచూచి వచ్చుచుణ్టిని. ఆయమ్మచేతిలో, ఈ యయ్యచేతిలో బిడ్డనలిగిపోవునని భయపడితిని. కడుపుతీపిగాని రాజులు బిడ్డను నలఁగనిత్తురా.

ఒక యేటికొకయేడు పైనిఁ బడినకొలఁది, బిడ్డకు ఆకారము మాఱినది. దేశదేశాల బిడ్డపేరు మ్రోగినది. రాజులకేమి నిల్కడ? లేచినను బడినను ఎత్తుగోడలే. ఈరాజునుగొట్టి ఆ రాజు. ఆ రాజునుగొట్టి యిఙ్కొకరాజు. మహారాజు, రాజరాజు ఏమని యెత్తుకొన్నాఁడో, ఏరాజువచ్చినను నాబిడ్డను జఙ్కదిమ్పలేదు.

రాజులు విడువఁగా మన్త్రిలు, మన్త్రిలు విడువఁగా రాజులు బిడ్డను కాలు క్రిన్దఁబెట్టనిచ్చినారనుకొన్నావా? ఏమిబిడ్డరా! ఏమిబిడ్డరా! అని నెత్తినిఁబెట్టుకొనని వారులేరు.

సొమ్ములమీఁద సొమ్ములు, గుడ్డలమీఁద గుడ్డలు, శిరస్సు దగ్గఱనుణ్డి చీలమణ్డదాఁక దిగవేసినారు. బిడ్డముఖారవిన్దము అటువణ్టిది.

నాబిడ్డ కేణ్డ్లన్ని యేతేరున గడచినవో ఫూసగ్రుచ్చినట్లు చెప్పి విసివిమ్పను. ఏణ్డ్లు పైనిఁ బడ్డవి. ఆకారము మాఱినది. కాని బిడ్డయెదిగినట్లగపడదు. పెట్టిన సొమ్ములు, తొడిగిన గుడ్డలు బిడ్డను ముఞ్చివేసినవి. అవి చూచియే అన్దఱు భ్రమపడ్డారు. బిడ్డకుఁ జక్కిలిగిలిపెట్టెడువారు, బిడ్డను నవ్విఞ్చెడువారు, బిడ్డవి వచ్చీరానిమాటలు వినెడువారు; ఎవరిముచ్చటవారు తీర్చుకొన్నారేగాని బిడ్డ యెదుగుచున్నదా లేదాయని విచారిఞ్చినవారులేరు. ఏరాజున్నాఁడుగనుక, పదికాలాలపాటు; బిడ్డపెరుగుడు కనిపెట్టుటకు? మఞ్చిబిడ్డ, రాజులమేడల కలవారైనబిడ్డ, అని ఏరాజుపట్టినను పఞ్చప్రాణాలు విడిచెడువాఁడు.

ఏరాజువచ్చినప్పుడారాజుకు బిడ్డ క్రొత్తదిగానే కనపడ్డది. ఈబిడ్డపుట్టినదెప్పుడు? ఎన్నేణ్డ్లుగడచినవి?. పెరుగు డేవిధముగానున్నది? అను విచారణ యేరాజునకుఁ బట్టినది! రాచకార్యాలన్ని విడిచిపెట్టి!

నేను నాబిడ్డ అన్తవఱకదృష్టవన్తులమే. బిడ్డనుజూచి రోఁతపడుదురేమో అని యెన్త భయపడ్డాను! వారి ధర్మాన గుడ్డలచాటున, సొమ్ములచాటున ఉన్న మొగ మన్తగా పరీక్షపట్టి చూడలేదుగాని.

నిజమెన్దుకు దాచిపెట్టవలె? బిడ్డముఖమునకు అన్దమేచెడినది. వికారపురూపుపడ్డది. కళకళలాడుచు మల్లెపువ్వువలె ఉన్న మొగము ముదరఁ బాఱిపోయినది. నీవేచెప్పు. ఏణ్డ్లే మోపైనిఁబడె. ముదిరినదన్న ముదరదు. అన్ని యెదిగితేనే మొగము తగ్గట్టుణ్డి యిమ్పూ సొమ్పూ. కాళ్లు కట్టెలైనవి. పొట్ట లావైనది. బిడ్డనుజూచుకొన్నప్పుడెల్ల నాకడుపుకుమ్మరావమువలెఁ గుమిలిపోవుచున్నది నాయనా! ఏమనుకొన్నావో.

ఇన్త అమ్మాడకపోయె. తప్పటడుగులు వేయకపోయె. బిడ్డకు దయ్యమే పట్టినదో, భూతమే పట్టినదో, యెవరాదిక్కు ? అని ప్రాణము ఎన్నివిధాలనో తపిఞ్చినది. రాజుల చేతిబిడ్డ; తక్కువలేదు. అని అనుకోవచ్చును గాని బిడ్డయెదగదని రాజులకుఁ జెప్పితే వారి కేమిరోఁతపుట్టి బిడ్డను విడుతురో అని భయము. ఒక వడుగుచూచినను, ఒక పెణ్డ్లి చూచినను, నాకడుపుతఱుగుకొనిపోయెను. లేకయొక దుఃఖము. ఉణ్డియొకదుఃఖము. బిడ్డను దెచ్చి దగ్గఱఁ బెట్టుకొన్దునా అని యుణ్డును గాని రాజులతోఁ గూడినపనే అని త్రొక్కులాట. రామచిలుకను బెఞ్చినట్లు బిడ్డనుబెన్చుచున్నారు. మహారాజుల మన్దిరాలలో బఙ్గారు గిన్నెలతోఁ బాల్దాగిన బిడ్డను నేను దెచ్చుకొని మాత్ర మేమిసుఖపెట్టుదును,నాయనా ?

మొలలోతు దుఃఖములో మోకాలిలోతు సన్తోషమని, పాలేకాదు; పణ్డ్లేకాదు; అన్నమేకాదు. ఏవిపెట్టినను ఇన్తనోరుతెఱచి తినుటయున్నది. పన్నీటిస్నానాలు. కస్తూరి వాసనలు. పూలహారాలు. ఏమిచెప్పుదును, ఆరాజులసన్దున నాబిడ్డకు జరిగినవైభవము?

టఙ్కాలకుప్పలు! వరహాలరాసులు ! బఙ్గారుగట్టలు ! బిడ్డమున్దుపోసెదువారు. రాజులు అన్దలాలెక్కితే అన్దలాలు, అమ్బారీలెక్కితే అమ్బారీలు. బిడ్డకు రాజభోగాలన్నీసాగినవి. రాజే బిడ్డను బుజాలమీఁద పెట్టుకొన్నప్పుడు, అన్దలాలు, అమ్బారీలు లెక్కా? ఎన్త యదృష్టము! అని అననివారు లేరు. ఏటిమీఁద ఏడు ఎన్నో యేణ్డ్లుగడచినవి. ఒక యేడుగాకున్న ఒక యేటనైన బిడ్డ యెదుగునేమో యని చూచితినిగాని యేనాఁటికి ఎదగదు.

బిడ్డకు రోగము వచ్చిన దని యేడ్చితిని. మొదటి నుణ్డి నాయిణ్టిలోనున్నను బాగు పడునను కొణ్టిని. ఈముసలిది సోదిచెప్పుచున్నదని తలఁపకుము. నాయనా! దినములొక తీరున జరుగవు. రాజులపోర్లు బలమాయెను. తురకరాజులు వచ్చినారు. ఈయడావుళ్లలో బిడ్డ నెక్కడ గొన్తుకోయుదురోయని నాప్రాణాలలోఁ బ్రాణాలులేవు. తురకలకేమి దయాదాక్షిణ్యాలు? అది యిది యెత్తి, థూ, యిదేమిబిడ్డరా! అన్నాఁడు ఒకతురకవాఁడు. తిన్నఁగ నాబిడ్డనునేను ఇణ్టికిఁ జేర్చుకొన్నాను. ఒకతురకరాజు వద్దని, ఒకతురకరాజుదగ్గఱకుఁ దీసి, ఈ తీరుగాదినాలుగడచినవి. అన్దఱు నోళ్లలో నానిన బిడ్డగనుక సన్స్థానాలకుఁ దీసికొనిపోయినను, ఒకకాపుకు జూపినను, ఒక కరణమునకుఁ జూపినను, పూర్వపువాసినిఁ బట్టి బిడ్డకు ఇన్త ఆదరణ చూపెడువారు. బిడ్డను ఇణ్టిలోనే పెన్చుకొణ్టిని. బిడ్డ వ్రేలెడు కూడఁ బెరుగలేదు. మొగము పెఙ్కనది. బట్ట తలపడ్డది. కాళ్లుచెడిపోయినవి. చేతులు మొద్దులైనవి. బిడ్డనుజూచిన కొలఁది గుణ్డె నీరైపోవునే కాని ధైర్యముకలుగదు.

నా బిడ్డరోగము కనుఁగొన్న వారులేరు. మఱుగుజ్జు బిడ్డా అని చూచితే కదలనేలేదు. మఱుగుజ్జు బిడ్డ సగముకాకున్న సగమైనఁ బెరుగదూ. ఏమిరోగమో యెవరును జెప్పలేరు. ఏనాఁడుపట్టినను పుట్టెడుందిగులునాయనా. తెల్లరాజులువచ్చినారని చెప్పుకొన్నారు. మంచిరాజులు, మంచిరాజులు అని అన్దఱు అనుకొనుచుణ్డఁగా, ఎవరైన నా బిడ్డగతి చూతురేమో అని ఎన్తపరితపిఞ్చితిని? పూర్వపువాసి విని తలయూచినవారొకరు. దూరముగాఁ జూచి బిడ్డపై ఒకకాసు, రెణ్డుకాసులు పడ

వేసినవారొకరు. పాపము దలఁచినవారొకరు. మొగము చిట్లిచ్చుకొన్నవా రొకరు. ఎత్తు కొన్న వారులేరు. చక్కను బెట్టుకొన్నవారు లేరు. ఎఁదుకు నాయనా! భ్రమ. బిడ్డకు వెను కటిరోజులు తిరిగి రావు.ఆదినాలుకావు. ఆ రా జులుకారు. నిజమునకేమి? బిడ్డ ఏమంతశృఙ్గా రముగా ఉన్నదని నెత్తినిఁ బెట్టుకొన్నరు నాయనా ఇతరులు, నాయేడుపేకాని.

పోనీ! ఆవైభవము రమ్మన్న రాదు. బిడ్డను దగ్గఱకు దీసి యీబిడ్డ యిట్లున్న దెందుకు?రో గమేమి? నొప్పేమి? అన్నవారైన నున్నారా? అదీలేదు. ఎవరేమనుకొన్నను కడుపుగదా. బిడ్డ పెరుగునేమో బాగుపడునేమో, ఒకరు గాకున్న ఒక రాజైన నాపాలిటిదైవమై బిడ్డగతి కనుఁగొనునేమో అని ఆశతో, పరమాత్ముని మీఁదభారమువేసి దినాలు గడుపుచుంటిని.

ఇటుచూడఁగా నాబిడ్డ కేడువెనుకలఁ బు ట్టినబిడ్డలు పెరిగి పెద్దవారైనారు. తల్లులకడుపు చల్లఁగా కళకళలాడు చున్నారు. నలువ్వరలోఁ బేరు, ప్రతిష్ఠ సమ్పాదిస్చు కొన్నారు. సిరి, సంపద, ఫలానివారనఁగా, ఎక్కడకుఁ బో యినను ఘనత, గౌరము, వారికేమి? మహా రాజులుఅని అనిపిస్చుకొన్నారు. దేశ దేశాలు తిరిగినారు. లోకములోఉన్న, విద్యలన్ని నేర్చు కొన్నారు. ఏమేమిశాస్త్రిలో చదివినారు. గాలిని కదలకుమన్నారు. నీటిని నిల్వుమ న్నారు. అగ్నిని ఆగుమన్నారు. భూదేవతల నంధా వీరేనని అన్దఱు పొగడుచున్నారు.బ్రహ్మ కుబ్రహ్మలై నిల్వఁబడ్డారు.ఆబిడ్డలను జూచి నా బిడ్డను జూచుకొన్నప్పుడు నాగుణ్డె, కోసికొని పోవుచున్నది. అన్దఱవలెనే నేనును గంటిని. రాజులచేఁ బిడ్డ! నాయన్త అదృష్ట వన్తురాలు లేదు. అని అనుకొంటిని. నాయనా! ఏమి రోగమో ఏమో నాబఙ్గారు వట్టిబిడ్డను బాడు చేసి కూర్చున్నది. ఆరోజుకు, ఆరోజుకు, బిడ్డ బొత్తిగాఁ జెడిపోయినది నాయనా! ఏడుపు ఆరమ్భమైనది. ఎడతెగని యేడుపు. మనుష్యు నిఁజూచిన తోడనే మఱిమఱి యేడ్చును. జాలిపడి యెవరైన నేదైనఁ బెట్టినఁదినును. మరల నేడుపు మొదలుపెట్టును. గొప్పగా బ్రతికినబిడ్డ! ఈరోజులలో ఏడ్పులు వినెడు వారెవరు ? భోగభాగ్యాలు, కీర్తి ప్రతిష్ఠలు, గొప్పతనాలు, లేకపోఁగా, అన్నమునకే అగ చాట్లుపడు మన్నది. అనఁగూడదుగాని నాయ నా! చచ్చినదానిలోను బ్రతికినదానిలోను జమకాకున్నది. పడఁగలపాట్లన్ని పడితిని. బిడ్డ రోగముచెప్పినవారు లేరు. బిడ్డయెదగదు. ఏణ్డ్లు గడచినవి. పూణ్డ్లుగడచినవి. రాజ్యాలు మాఱినవి. రాజులు మాఱినారు. నాయనా! బిడ్డ యెదుగదు. పుట్టినప్పు డెన్తయెత్తో, ఇప్ప టికిని అన్తెయెత్తు. కనకమువణ్టి మొగము నాయనా! ఈతీరున అయిపోయినది. తెల్లడాక్ట ర్లు ఘనవైద్యులని చెప్పినారు. బిడ్డను దీసికొని పోయిచూపి జరిగినదంత చెప్పితిని. బిడ్డయిఁక నెక్కువదినములు బ్రతుకదుఅనికొన్దఱన్నారు. నాగుండె లవిసి పోయినవి. ఎన్తకష్టపడికంటిని. ఎన్నాళ్లుపెఞ్చితిని అని యేడ్చుచుంటిని. ఏడువ కు. రాజులయిణ్డ్లలోఁ జిన్నతనముననే తిన రానిదెల్లఁ దినుటవలన బిడ్డకు పొట్టపాడైనది. ఇఁకఁ బెరుగదుగాని బ్రతుకును. అని కొన్ద రోదార్చిరి.

పాపము ! శస్త్రముచేసి, మందులిచ్చి బిడ్డ కుఁదగ్గ వైద్యముచేసిన బాగుపడును. ఎన్దఱు బిడ్డలు బాగుపడలేదు ? మేము చేయఁగలది చేసెదము అనికొన్ద అనుచున్నారు.

తెల్లవైద్యము నేర్చిన మనవారికిఁజూపితిని. బిడ్డపెంపు ఆగిపోయినది. ఈతల, ఈకాళ్లు, ఈచేతులు, ఈపొట్ట తీసివేసి క్రొత్తతల, క్రొత్త కాళ్లు, క్రొత్త చేతులు, వేయవలె నని కొందఱు చెప్పిరి. అక్కఱలేదు. మన్దులు వేసి చూచెదము అవసరమైతే కొంచెము గాఁదలను, పొట్టనుశస్త్రము చేసెదము, చెడి పోయినవి, పడిపోయినవి తీసివేసి క్రొత్తవి పెట్టెదము, బిడ్డను బాగుచేసెదము. అనికొన్ద అనుచున్నారు. ఏమిూతోఁచినది కాదు నాయనా! మొద్దో మొగరమో చూచుకొనుట కైన లేకుండ ఏమిచేయుదురో అనిభయము. రోగము పోవునేమో బిడ్డ బాగుపడునేమో అని ఆశ. ఏమిచేయుదునా అనిత్రొక్కులాడు చున్నాను. కడుపుమంట ఆవిధమున బాధ పెట్టుచున్నది. చూచుచుఁ జూచుచుఁ గోయి న్పుటకుఁ జేతులాడవు నాయనా!

---

## [1]రిరంస—లజ్జ.

ప్రకృతిని లోఁబఱచుకొన వలెనని వేదాంతులు యత్నించుచుండఁగా [2]బుభుక్ష, రిరంస, ఆపని చేయున్నవని యొకజ్ఞాని చెప్పెను. ప్రపంచములో మనుష్యుఁడు ఆకలి తీర్చుకొనుటకు స్వశక్తినేకవిధముల నుపయోగించెను. కృషి, పాశుపాల్యము, వాణిజ్యము క్షుత్తుయొక్క వాడిమొన వలనే యాకృతి వహించినవి.

ఆకలితీరినది. మనుష్యునిశక్తి యూరకుండునా? రమింపనిచ్ఛకుఁ గారణ మాయెను. ఈయిచ్ఛయే కుటుంబముల యొక్కయు సంఘములయొక్కయు నడుగునన్నది. నీతిబంధములు, ధర్మపాశములు ఈయిచ్ఛాగర్భము నందే యుండెను. మనుష్యుని మనోవేదనలన్ని బీజప్రాయముగ మృగప్రపంచమునఁ జూడవచ్చును. కవులువర్ణించిన శుద్ధప్రేమ మాత్రము మృగమెఱుఁగదు.

కానిరిరంసకు మోటుఁదనమును దొలఁగించునేర్పు కొన్నిజాతువుల యందును గనఁబడుచున్నది. ఈనేర్పుకూడలేని నింద్యమైన ప్రాకృతప్రేమ నాగరకవలయమున నింకను దిరుగుచున్నది.

కంఠస్వరమువలనఁ గొన్ని, శరీరవిన్యాసము వలనఁగొన్ని, పక్షవర్ణములవలనఁ గొన్ని ఆడవానిని మెప్పించు పిట్టలుగలవు. ఒకపిట్ట చక్కని గూడుకట్టి దానిని ద్వారమునఁ బువ్వులు పఱచును. ఆడుపిట్ట యాప్రదేశమును గాంక్షించి యాగూటఁ బ్రవేశించును. అనాగరకమనుష్యులెఱుఁగని సుకుమారములైన ప్రేమమార్గముల నవలంబించు పక్షులివి.

ఎస్కీమోనియనులు, ప్యూజియనులు లజ్జనెఱుఁగరు. తీవ్రమైన చలినుండి కాపాడుటకుఁ గప్పుకొను తోళ్లు చలిపోయినతోడనే తీసివైతురు. ఇట్లు ఆఫ్రికా, ఆస్ట్రేలియా, న్యూగినీలాండు మొదలైనప్రదేశములలోఁ బురుషులు, స్త్రీలు ఆచ్ఛాదనలేకుండ సంచరింతురు. యూరపియనుల నాగరకతను గొంతవఱ కవలంబించిన సాండిచిదీవులలో నిప్పటికిని స్త్రీలు పడవలవద్ద కీదవలసి వచ్చినప్పుడు గుడ్డలువిప్పి నెత్తిపైఁ బెట్టుకొని దిసమొలలతో నీదెదరు. ఒడ్డువల వద్దకుఁజేరి గుడ్డలుకట్టుకొందురు. క్రైస్తవమతమును పాదిరీలు వ్యాపింపఁజేసిన న్యూసిథిరియాలో ననేకదినముల వఱకు స్త్రీలు సముద్రపు రేవున మడిమలలోతు నీళ్లలోనిల్చి నగ్నలై స్నానము చేసెడివారు. ఎచ్చట జనులు

1 రమింపనిచ్ఛ 2 భుజింపనిచ్ఛ.